# చక్కట్ల దండ

మహాకవి
దాసు శ్రీరాములు

ప్రకాశకులు :
మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి
3-4-885/A బర్కత్‌పురా, హైదరాబాద్

# చక్కట్ల దండ

మహాకవి దాసు శ్రీరాములు

ప్రకాశకులు :
మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి
వాణీ సదనము, 3-4-885/A, బర్కత్‌పురా
హైదరాబాద్-27

# కృతజ్ఞతలు :

—o—

గ్రంథమునందు ముద్రణా స్ఖాలిత్యము లేదవకుండుటకు ఋజు పత్రము (ప్రూఫు)ల సరిదిద్దిన 'గాన కళాప్రపూర్ణ' సంగీత సాహిత్య కళానిధి శ్రీమాన్ యన్. సిహెచ్. కృష్ణమా చార్యులవారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు.

మా యందత్యభిమానముతో ఈ గ్రంథమునకు పీఠిక వ్రాసి యిచ్చిన డాక్టర్ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి, రీడర్ & హెడ్ ఆఫ్ ది డిపార్ట్‌మెంట్ ఆఫ్ తెలుగు, ఆంధ్ర యూనివర్సిటి, వాల్తేరు, గారికి మా ప్రత్యేక కృతజ్ఞతా శతశతములు.

విజయవాడ
1—9—1984

దాసు పద్మనాభరావు
అధ్యక్షుడు
మహాకవి దాసు శ్రీరాములు స్మారక సమితి



'మహాకవి'

దాసు శ్రీరామ పండితులు.

# పీఠిక

— డాక్టర్ చిలుకూరి సుబ్రహ్మణ్యశాస్త్రి

తెలుగులో వ్రాయాలి, అచ్చ తెలుగులోనే వ్రాయాలి అనే కోరికా పూనికా మధ్య మధ్య కొందరికి కలిగింది. అటువంటి రచనలవల్ల రచయిత పూనిక నెరవేరుతుంది. పాఠకులకు భాషా పరిజ్ఞానమూ కలుగుతుంది. కాని దానివల్ల చాలా కృతకమైన భాష ఏర్పడుతుంది కూడా. పుడమిదయ్యము, బొమ్మ గ్రుడ్డు, కతలి మొల, నూలుచేడియ కనినపడుచు, మంచిమెడ, యెకిమీడు మొదలైన పదాలకీ, ఈ పూనికకీ పేగు సంబంధం ఉంది. ఆయాపదాలు ఆయా కావ్యాలకు ముందూ లేవు; తర్వాత వాడుకలోకిరాలేదు; అవి ఆయా కవుల కిట్టింపు ధోరణికీ, అతుకుల బుద్ధికీ పరిమితమయిపోయాయి; లోకానికి క్షేమం.

దాదాపు నూరేండ్ల క్రిందట అచ్చ తెలుగులో ఈ 'చక్కట్ల దండ' వెలసింది. లౌకిక నీతి మాలిక అన్న సంస్కృత సమాసానికి తెలుగులో ఏర్పడిన అతుకుల బొంత పేరు చక్కట్ల దండ. అయితే ఒక్క పేరులో తప్ప, సామాన్య పాఠకులకు సులభంగా అర్థంకాని పదాలు ఇందులో లేనట్లే; సంతోషం.

దాసువారు సంస్కృత సమాలను ఈ శతకంలో వాడలేదు. ఇది అచ్చ తెలుగు కావ్యాల పద్ధతియే. అచ్చ తెలుగులో అదృశ్యమైనది సంస్కృత సమం మాత్రమే కాని ఆంగ్లమూ, ఉర్దూ చొరబడ్డాయి. అవి తెలుగులో ప్రవేశించి వాడుకలోకి వచ్చాయికదా అని కవిగారి వాదం. సంస్కృత పదాలూ ప్రవేశించినాయి కదా? మరి వాటికిలేని స్థానం ఉర్దూ, ఆంగ్లీషులకు ఎల్లా దక్కింది?

దీనికి చారిత్రక కారణం వెదకాలి. తెలుగులో అచ్చ తెలుగు కావ్యాలు పుట్టేనాటికి సంస్కృత సమాలే ఎక్కువగా ప్రవేశించాయి. కనుక అచ్చ తెలుగు అనగానే సంస్కృత పదాలను పరిహరించవలసివచ్చింది. అచ్చ అంటే, 'సంస్కృత సమేతరంబయిన భాష' అని లక్షణ వేత్తలు నిర్ణయించారు. దాసువారు ఈ సంప్రదాయాన్నే కొనసాగించారు. కాని అచ్చ తెలుగుమీద, వల్లమాలిన వ్యామోహం లేకపోవడంవల్ల, దైనందిన వ్యవహారంలోని విదేశీ భాషాపదాలను వీరు వాడినారు. అస్తు.

నీతి పద్యాల్లో సుమతీశతకం మకుటాయమానమైనది; వేమన పద్యాలు అత్యంత సుందరాలు. అయితే సామాజిక పరిస్థితులనుబట్టి అనేక నీతి పద్యాల శతకాలూ (విశేషించి సీసపద్య శతకాలు) సంపుటులూ వెలువడ్డాయి. చక్కట్లదండ ఒక చక్కని పద్య శతకం. (తెలుగు శతకాలు సర్వసాధారణంగా అష్టోత్తర శత సంఖ్యా విస్తృతం. చక్కట్లదండ శతమాన పరిమితం.)

దాసు శ్రీరాములుగారు బహుముఖ ప్రజ్ఞాశాలి; ప్రతిభా వ్యుత్పత్తులు సమపాళ్లలో రంగరించుకొన్న కవి, గొప్ప ధారాశుద్ధిగలిగిన రచయిత. న్యాయవాదిగా, సంఘ సంస్కర్తగా, జ్యోతిశ్శాస్త్రవేత్తగా ప్రసిద్ధులు. వారి లేఖిని నుంచి వెలువడిన ఈ శతకాల్ని దండ - క్రీ శ. 1894 వ సంవత్సరం ఆగష్టు నెలలో పూర్తి అయివుదని కవి యిల్లా అంటున్నారు.

జయ సంవత్సరం (గెలుపు సాలున) వర్షర్తువునందు (వానకారు) శ్రావణ మాసరతో (మింటి వెలయుందు) కృష్ణపక్షంలో (వన్నెతగ్గెడినాళ్ల) పంచమినాడు (వడగ కాల్పెడి రోజు) అశ్వనీ నక్షత్రమందు (జేజేల వెజ్జులు) వృశ్చికలగ్నంలో (చెలగిన తేలు) అనగా అపరాహ్ణం ౬-00 గంటలకు ఇది పూర్తి అయింది. (వృశ్చిక రాశియని పొరపాటున పడి ఉండవచ్చును.)

కవిగారు చక్కని ధారాశుద్ధిగలిగిన రచయిత అన్నాం. క్రింది పాదాల్లో అది ప్రస్ఫుటం.

1. కురియక కురియక కురిసెనా మొయివారి
   మొదవాన పొలమెల్ల మొద్దుకన్ను
   కాయక కాయక కాచెనా తగఁబూచి
   గున్నమామిడి కొమ్మ కోటివేలు... ...........

2. పొరుగు వారికి మేలు పొందరాదందువా
   ఇరుగువారికి నీవ పొరుగువాఁడు
   ఇరుగు వారికి మేలు పొందరాదందువా
   పొరుగు వారికి నీవ ఇరుగువాఁడు

3. నెలఁదప్పి సంతసా నిసువు పుట్టఁగఁ బోదు
   నిండఁ దొమ్మిది నెల లుండవలయు
   వరినాటి సంతనే వడ్లురావు పంట
   కళ్లాల దనుకనుఁ గాయవలయు ...

కవిగారు హాస్యప్రియులు : ఉదాహరణకు

1. పదినెంబు పట్టిన పాదుషా మీఁగడ
   చీదునా చీమిడిఁ జీదుఁగాక ...

2. వేదు రెత్తినకుక్క వేఁటకై కొనిపోవ
కట్టి పెంచిన వాని కాలుఁ గఱచు ......

3. తేలుకుట్టినవాని మేలైన పల్లకి
మీఁద నెక్కించిన బాధ లేదె....

రంధ్రాన్వేషణ తత్పరులను హాస్యధోరణిలోనే ఝుందలిస్తూ-

1. సానితో నిచ్చ ముచ్చటలాడు విటగాఁడు
గుడిసెవేటును కూడు కోడెఁదూడ,
గొడ్డునంజుడు కొనిపోయెడి గొడారి
పనికిమాలిన దెత్తుపాకిఁ దిట్టు,
తగునంచు గంజాయి దమ్ముఁగొట్టు పిసాసి
కల్లుఁద్రావెడి దోసకారి నెంచు
ఏటిటి దెనసాల కేఁగు బాపఁడు పాడి
దాల్చు బాపని నెగతాళిసేయు ...

అని వ్రాశారు.

ఒరుపు చేటగు అరువు సొమ్ము అనర్థకాలని, హేళన చేసారు కవిగారు, క్రింది ధోరణిలో వ్రాశారు.

1. వేసాలపేదికి మీసాలమర్చిన
మగాతి బిగియు పట్టి మొత్తుకొనును....
గమిడి బట్టెకు గుడ్డగండోల్లట్టిన
చీదరించుక పట్టి చించివైచు....

2. గుట్టంబు డెక్కను గోసి రెండొనరింపఁ
బుట్టెపైఁ గొమ్ములు పుట్టఁబోవు
కంద మ్రోకను దలక్రిందుగాఁ బ్రాతిన
కాడమీఁదనుఁ గాయగాయఁబోదు....

కవిగారికి కొన్ని మోజులున్నాయి, చూడండి.

1. విక్టోరియారాణి వెలసి యేలుటఁబట్టి
యిండియా పొగడిక యెక్కువాయెఁ
బండ్లతోటలు దొడ్డపైరులఁ బట్టి
మద్రాసు ప్రెసిడెన్సి మంచిదాయె
తియ్యఁజక్కెరవంటి తెలుఁగునుబట్టి గో
దావరి డిస్ట్రిక్టు కీర్తిఁగాంచె
మేలైన పని తివాచీల నేతనుబట్టి
యేలూరు పెద్ద పేరెక్కెనాయె....

2. గెలుపిండియానాడ! గెలుపింగ్లిషు మాట!
గెలుపు వేలుపుఁబాన! గెలుపు తెలుఁగ!
గెలుపు స్టీమరులార! గెలుపు రైలోడ్లార!
గెలుపు హైస్కూళ్లార! గెలుపు సైన్స!
గెలుపు కాలువలార! గెలుపు సోద్దెపు టాన
కట్టలారా! టెలిగ్రాపులారా!
గెలుపు డార్విన్ ఫిరీ! గెలుపు థియోసఫీ!
గెలుపు నేషనలు కాంగ్రెస్సు నీకు!
గెలుపు విక్టోరియారాణి! గెలుపు గెలుపు
గెలుపు గెలుపని పలుకుటె గెలుపు మనకు ...

ఇల్లా చూపించుకొంటూపోతే, పుస్తకమంతా ఉదాహరించాలి; ప్రతి పద్యంలోనూ, ప్రతిభావంలోనూ ఏదో ఒక విశేషం ఉంటోంది మరి!

మరి సెలవు.

# పీఠిక

ఈ చిన్నపుస్తకముపేరు "చక్కట్ల దండ" ఈపేరు అచ్చతెలుగుమాటలతో గూర్చఁబడినది. ఈ గ్రంథము సంస్కృతిసమములు అనగా తత్సమపదములు చేరకుండ వ్రాయఁబడినది. కావున దీనిపేరు అట్లుగానెయుండుట యుక్తమని యేర్పరుపఁబడినది. చక్కట్లు = లౌకికనీతులు; దండ = మాలిక కావున లౌకికనీతిమాలిక" యనునర్థమిచ్చుచున్నది. ఇది నూరు సీసపద్యములు కలదయి యున్నది. ప్రతి పద్యముయొక్కతుదను గీతచరణములు రెండుమాత్రము అన్నిపద్యములకు సమానము. అవి యేవనగా "అనిపలుకు దాసురాముఁడిట్లుచెప్పె తెనుఁగు । కబ్బమందము నిండ చక్కట్లదండ।". ఈ గ్రంథమును సులభశైలిలో వ్రాయుటయేకాక లోకానుభవమువలన మనకు తెలియుచున్న వస్తువులు వాని గుణములు క్రియలు మాత్రమే దృష్టాంతములుగా గయికొనబడినవే కాని దేవతలు పిశాచములు రాక్షసులు స్వభావ విరుద్ధములై గ్రాంధికములయి కనుపట్టినవి దృష్టాంతములుగా జేకొనఁబడలేదు. కాని మొదటిపద్యమునందు దేవతాస్మరణము నుద్దేశించియు పదునొకండవ పద్యము యొక్క 1-3-4 పాదములయందు హిందూదేశవాసులు సుప్రసిద్ధముగా నెరిగి యున్నట్టి దేవతలు పేర్కొనఁబడిరి.

"దకినీ" భాషలోనుండి తెలుగులో వాడుకగానుండు పదములును ప్రకృతదేశాధీశులగు నాంగ్లేయుల భాషలోని పదములును అచ్చటచ్చట సందర్భానుకూలముగా ప్రయోగింపబడినవి. వక్రగతులు ప్రక్రమభంగములును సాధ్యమయినవట్టు లేకుండునట్లు జాగరూకతతో వ్రాయబడినది ఇది జయసంవత్సర శ్రావణశుద్ధ ప్రతిపత్తునాడారంభింపబడి శ్రావణ బహుళ పంచమీ జయువాసరమునాటి రెండుజాముల పగలింట ముగింపబడినది. హూణశకము 1894 వ సంవత్సరము అగస్టునెలయగుచున్నది. మొదటిపద్యములో బ్రహ్మదేవునకు బొమ్మయని పలుకఁబడినది. గ్రాంధికమగు తద్భవము బమ్మయయినను బొమ్మయనివాడుట గ్రామ్యములయందు ప్రసిద్ధమయి యున్నందునను తద్భవములకు లోకప్రసిద్ధి ముఖ్యప్రమాణమయి యున్నందునను తద్విరుద్ధమగు శబ్దజ్ఞసమయము లేదుగావునను సందర్భమునందు శ్రావ్యముగా జూపట్టినందునను అట్లుప్రయోగింపఁబడియె. రేఫ, శకటరేఫల వైధర్మ్యము లేదనువారి మతమే చేకొనంబడియె. సందర్భానుకూలమగు క్రొత్తపోలికలు దొరకనిపట్టులమాత్రము పూర్వమునుండి ప్రసిద్ధిగావచ్చు పోలికలు పుచ్చుకొనఁబడియె. ఇవి గ్రంథమందంతటను పదివంద్రెండుండును.

సుజనులు దోషములనుబోవిడిచి గుణములున్నయెడల వానికిమాత్రము సంతసించి నన్నుంధన్యుఁజేయఁగోరెద.

ఏలూరు.
21-8-1894

విధేయుడు,
దాసు శ్రీరాములు

శ్రీరస్తు

# చక్కట్లదండ

యను

## లౌకికనీతిమాలిక

సీ॥ సిరికిఁ దొమ్మిదిచ్చి మచ్చికసేయు నిచ్చలు। వెన్నుండు దావేల్పువేలుపయిన
మిన్నేటిచెలి నెత్తిమీద బెట్టుక మోచు। ముక్కంటి జేజేల ముదుకయయిన
పలుకువెలది నోటబట్టి ముచ్చటలాడు। బొమ్మ దాదేరగంటి పెద్దయయిన
తలువకంటులగిద్దె గదలనీ కాడింతు। దెసరేడ్లు ఘనవాల్దిట్టలయిన

గీ॥ కస్తి రానీక నిల్లాండ్ర గాచువారి। యింట సేమంబు దరుగక యుంట నిజము
అని పలుకు దాసురాముఁడి ట్లచ్చతెనుగు। కబ్బ మందమునిండఁ జక్కట్లదండ

సీ॥ బంగారుబొమ్మకు రంగు బూయగనేల। పేడబొమ్మకు బూయుగూడుగాక
పాసెంబునకు నూరుఁ బద్ద నంజగనేల। చోదంబలిని నంజ గూడుగాక
పెద్దమట్టికి గాలిబెట్టు బెట్టగనేల। మేడిమ్రోకకు బెట్టగూడుగాక
వెండిగిన్నెకు జింతపండు పుల్కాపేల। వాడ నిత్తడికిడ గూడుగాక

గీ॥ వాసిగలవారి కింకొక్క వాసితోడువల దలంతికి నెపుడుగా వలయుగాక
అనిపలుకు ॥ 2

సీ॥ కోతి దాఁజెట్టెక్కి కూసినంతనె క్రింది। కొదమసింగము వాసి కొరతవడునె
అంజరాయని మెప్పరా మరుల్కొల్పిన। నిల్లాలి మరియాద చెల్లకున్నె
పుల్లేరు దానెంత పొరలివచ్చిన బెద్ద। కొల్లేటి కడుపు దాగొదవయగునె
ప్రాంచితీగెలు చాల పయిబారి పెరిగిన। వద్దిమ్రానికి లావు కొద్దియగునె

గీ॥ క్రించుమానిసి తానెంత గింజుకొన్న మంచివాని బొగడ్తలు మాన్పలేడు
అనిపలుకు॥ 3

సీ॥ కాన్పుఁగత్తె యెరుంగు గాక యెన్నటికైన । గొడ్డురా లెరుఁగునా బిడ్డకుట్టు
గండుదేటి యెరుంగుగాక యెన్నటికైన । చిరుకప్ప యెరుగునా విరులతావి
కలమానిసి యెరుంగుగాక యెన్నటికైన । వట్టిపుర్వెరుఁగునా బట్టసొంపు
కాపుబిడ్డ యెరుంగుఁగాక యెన్నటికైన । పిడుకరుంగునె పాలతొడుకుపాడి
గీ॥ ఎరుకగలవా రెఱుంగుదు రెద్దియేని । యెరుకమాలినవారి కెట్లెరుకపడును
అనివలుకు॥ 4

సీ॥ తాటిబెల్లము వెన్నతోటి గల్పినమాత్ర । పారుబంతులకు జేవమగునె
- గులకరాతికిఁ బైడి కుప్పె బెట్టిన మాత్ర । కాసులదండ మేల్బాపయగునె
చెట్టగాడ్దెకు జీను గట్టితీర్చినమాత్ర । రౌతెక్క ననిలో నరబ్బి యగునె
కారుదున్నకు గొల్సుఁ గట్టికట్టినమాత్ర । అంబారిగట్ట రాహుత్తి యగునె
గీ॥ కొంచెగానికి బొంకము ల్కూర్చినంత । గొప్పవారలతో సరిగొల్పవశమె
అనిపలుకు॥ 5

సీ॥ ఉసిరికాయనుఁ దేనె నూరఁబెట్టుదురుగా । కుల్లిపాయనుఁ బెట్టనొల్ల రొకడు
కమ్మనూనెనుఁ గచొ రమ్మిడి కాతురు । పేరామిదములోన బెట్ట డొకడు
క్రొత్తచీరెల గెదగులు సేర్తు రేకాని గోచిపాఁతలఁజేర్చ కోఁడొఁడు
తగుతలాటము స్వారి దండె బెట్టుదుగాని । దంపనాఁగటికిడఁదలఁచఁడొకడు
గీ॥ మేటులగు వారికేగాక మేల్మిబొత్తు । కొలదివారికి రాదెంత కొట్టుకొన్న
అనివలుకు॥ 6

సీ॥ ముత్యాలసరిపడి తుసలమ్మతలకేల । కలికిమిటారి వేనలికిగాక
అద్దాలకిటికి తాటాకు గుడ్సెకు నేల । బెడఁగైన రచ్చచావడికిఁగాక
బలుసీమకాలు వుప్పరి నత్తిపయినేల । మేటిసేర్పరి మేనిమీఁదఁగాక
కాటిపట్టికును ముతాకి జెక్కగనేల । గటితంపుఁ దీకు దెక్కలకెగాక
గీ॥ విలువమాలిన వానికి విలువలేల । విలువగల మేటివలఁతుల కలరుఁగాక
అనివలుకు॥ 7

సీ॥ వడిసెంబు బట్టిన పామసో మీఁగడ । చీమనా బీమిఁడి తీసుగాక
జవరాలికిని యుబ్బ దవిలినా పన్నీరు । బుట్టునా చెమ్మట బుట్టుగాక
చెరుకుతోటకుఁ బుప్పి పెరిగెనా తులకండ । రాలునా మలుపిప్పి రాలుగాక
బూతపిల్లికి ముద్దుపుచ్చెనా జవ్వాజి । కట్టునా చెడుచీము కట్టుగాక
గీ॥ ఎట్టివానికి నైనను బుట్టుగుణము । చెటబుట్టిందుఁగాని మేల్చేయ దెన్న
అనివలుకు॥ 8

సీ|| ఆసూక దాసరికాఁడ యతక యొల్లెడఁ గాకు| మంచినేలను మల్లె పెంచవలయు
గుఱ్ఱ రాఘ్వార కద్దులనంటుఁ బొలముల | గనికాటుపడి రవ గాంచవలయు
పిల్లికూనలు తాపె యిల్లిల్లుగ్రుమ్మరు | పేమంది పులికూన వెదుకవలయు
కొర్రమాలి నాళువల్ కొలఁకు లన్నిటనుండు|కళకు ముత్తెపు జిప్ప కడలి దొరకు
గీ|| కొంచెగాఁ డ్రెల్ల తావుల గొదువవడరు|గొప్పవారుండు రరుదుగాఁ గొన్నియెడల
అనివలుకు|| 9

సీ। గుడిసెఁ గట్టిన లంజ కొడుకెంత ఆదివిన । తండ్రి పేరుమఁ జెప్ప దడివికొనఁడె
సాహెబు మెడ రెండు జంద్రెపోవులు వైవ సందెముక్కను వయిజాన్తయవడె
పిల్లకుక్కను దెచ్చి పల్లకిపై బెట్ట| ఆరతిచ్చిన దివ్వె లార్పబోదె
ఊబవానికి నొక్క యుదిదనుముడి బెట్ట|వగరు పెండిలినాడు వగవుగాదె
గీ|| తగనివానికి నొక దొడ్డతనముగూర్ప | నగడు పడుటయెకాని వొదలతిదనము
అనివలుకు|| 10

సీ|| ఆలి లోపలియింట నడచిపెట్టంగానె | కూళగండడు రాచకొమరుడగునె
దుడ్డుగోలను బట్టి దున్నెక్కంగానె| మాలండు పెతతుల వేలు వగునె
గొల్లగుడ్డలదోచి కొమ్మపైకూర్చున్న| కాటికెక్కలి తమ్మికంటి యగునె
తగవేదిగండని తలమీద నెక్కివగ| య్యాలి మిన్నేటి కన్నెయగునె
గీ|| చేతనయినట్టి యొకచెట్టచేత కేసి| చవుక మానిసి బలువకు సాటియగునె
అనివలుకు|| 11

సీ|| గొరియమందలగాచు గొల్లనమ్మిన కుక్క|వతికి గాచుకయుండు వదురు నక్క
యేటనీళ్ళకు నానయిడు రాచయేనుగు| ముదిగిన బలదారి కరుగు బంది
పెనిమిటిమాట చొప్పనబోవునిల్లాలు |తుంటరింద్రమ గొల్పు తులువ లంజె
రాచకోటలమెప్పు రాగాచు జెగజెట్టి | సందు గొందుల రేయిజరుగు దొంగి
గీ|| మంచివారల నడవడుల్మంచిచోట | పెద్దవారల వడవడుల్పెద్దచోట
అనివలుకు|| 12

సీ|| గుర్రంబుడెక్కెను గోసి రెండొవరింప| పుర్రెపై గొమ్ములు పుట్టబోవు
కంద్రమోకను దల కిందుగా గ్రాతిన| కాడమీదను గాయ గాయబోదు
కొండ్రముచ్చును దోకగోసి| యింటనెపెంప ఆమవెతిన మాటలాడబోదు
పటికరాతిని సొతబట్టింది తెచ్చిన |నుక్కుబోగరి దెబ్బ కోర్వలేదు
గీ|| పుట్టుసారయుయొట్టిల కట్టనిలచు |పెట్టుసారలు వారల చెట్టుకొరకె
అనివలుకు|| 13

గీ॥ గడిమిఁ జూడుక సాదుల నడఁచు వారి । గడిమి యెక్కువ గలవారలడఁచు
చుండ్రు
అనివలుకు॥ 23

సీ॥ గంతఁ దీసినసైన గంగిరెద్దు బోలాన । మెడద్రిప్పుడోలు చవ్వడులు విన్న
విసము బిండినసైన బెను బాము బుస్సని । కాటందునెద్దని గంటబడిన
ఆట నేర్చినసాని పీటపై గూర్చున్న । నడుగార్పు మద్దెల సడిని విన్న
వేట బాటిన కుక్క రాట గట్టినగాని । వలువ జూచునుగాటి వందిగన్న
గీ॥ బాగుగా నొక్క దలవాటు పడిన పనిని । మఱువ డాపనిమానిన తఱులనయిన
అనివలుకు॥ 24

సీ॥ ఓరు పింతయుఁలేక యుడుకు పీరయిమందులుచ్చాకు సాదుపల్కులు ములుకులు
పున్నెంబు గానక పొరుగు మిండలకేడ్పు । లమిడికి మగని చల్లాట తీట
ఋద్దిలే కాటల ద్బొద్దు బుచ్చెడు కుఱ్ఱ । బడవాకు వలపడి వ్రాతకోత
చేటుపాటెరుగక చెలగాడు బోకిరి । బే హాకు బెద్దల పేళ్ళుతేళ్ళు
గీ॥ దారి మంచిది కాని పింజారులకును । తిన్నదన మబ్బునది కలగన్న వితము
అనివలుకు॥ 25

సీ॥ వెట్టిగొల్లల ద్రోల పీటె బాడిన జంబ । నాదు తోడను సాటి రాదటండ్రు
కాటి రెడ్లకు హోళిగలు బెట్ట జిట్టారి । కలయట్లతో సరిగావటండ్రు
వెట్టిమాలకు సన్నబట్ట గప్పినగడ్డ । ముతక కంబడి కంటె మెతకయనును
ఒడ్డె యెడ్డెకు నత్తరుడికలో నిచ్చిన । చేవనూనియు పాటిసేయదనును
గీ॥ కొంచెగా డెప్పు గొప్పను గొలదిసేయు।కొలదియగు దానిగొప్పగా దలచు చుండు
అనివలుకు॥ 26

సీ॥ తగువులో న్యాయంబు దప్పకున్నె చాటు । లంచాల కాసించు అత్తుకోరు
పెండ్లాము బలువెతల్ పెట్టుకున్నెలంజె । మంచాల కాసించు మంకుబడవ
కాపు పేదరికంబు గనకిడ్వదే పుట్ట । కుంచాల కాసించు గుండగొయ్య
గేస్తు లోగిటిమేలు కీళ్ళారయునె తేర । కంచాల కాసించు గాలిగ్రుడ్డు
గీ॥ తగవు పున్నెంబు దలచునే తప్పు పనుల । కెప్పుడును తెప్పదవ్పని మొప్పికూ
అనివలుకు॥ 27

సీ॥ తుమ్మెద జేరెనా తమ్మితావులనాను । చీడపురుగు చేరి చెరచు దమ్మి
చిట్టూద మొలచెనా చెలువు దప్పదు నేల । బిట్టల్లి మొలచి పోగొట్టు బైరు

చక్కెర గలసెనా మిక్కిలి చవిగొల్పు । చవుడు గలసి చేదు సలుపు నీటి
వచ్చక పము చొఱకారెనా కాకార్చు । గంధ్రయిసుము సొచ్చి కలచుగన్ను

గీ॥ మంచి పొత్తైన నెందేని మంచిగాంచు। చెడుగు దలపడి కొరగాని చెయ్యిసేయు
అనిపలుకు॥ 28

సీ॥ చీమ కానుపు ప్రొద్దు జెప్ప నేర్పు నెవండు । చామ కానుపు జెప్ప జాలు గాక
పిఱుజు కాల్బందంబు బెట్ట నేర్పునెవండు । కఱుజు కాళ్ళకు బెట్ట గలుగు గాక
నత్తచే గుగ్గిళ్ళు నమలించునెవ్వాడు । గిత్తచే నమలింప నెత్తుగాక
మేడి చెట్టున నుయ్యేలాడించునెవ్వాడు । తాడి చెట్టున నిల్పువాడు గాక

గీ॥ క్రించు వారలకెప్పుడు మించు వారి । చెలిమి గలుగదు మించు వారలకె కాన
అనిపలుకు॥ 29

సీ॥ అల్లారు ముద్దుగా నాడించు పసిబిడ్డ । మెదమీద గూర్చుండి యొడలు చెఱచు
నేయి ముద్దయు బెట్టి నెయ్య మిచ్చిన పిల్లి; ఉట్లపై కెగసి పాలొలుక బోయు
పంచదారను మేపి పలుక నేర్పిన చిల్క । ముద్దు బెట్టగబోవ మూతి గఱచు
కమ్మని గుగ్గిళ్ళు గంపనిండగ బెట్టి । గట్ల మేపెడి యెద్దు క్రర గొఱకు

గీ॥ ఎరుక మాలిన వారల కెంత మేలు । గూరిచిన దాని దెలియంగ లేరుసుమ్ము
అనిపలుకు॥ 30

సీ॥ వేదురెత్తిన కుక్క వేటకై కొని పోవ । కట్టి పెంచిన వాని కాలు గఱచు
కుళ్ళు గుమ్మడికాయ కూరవండుకతిన । నింటివాని కడుపుమంట బుట్టు
తిట్టు బోతగునాలి దింద్రంబుగొని పోవ । కట్టుకొన్నాతని బెట్టు జెఱచు
కారు బారని సీతు కవులు దీసిన పంట । కాపు దీరువ దండుగలనె ముంచు

గీ॥ చెడ్డ సాదన గయికోలు చేసినటి । వాని కెప్పుడు బెడదలే వచ్చుచుండు
అనిపలుకు॥ 31

సీ॥ పరదారులకు లంజె బొరి దార్చు బేషరమ్ । ధగిడీలు తదుదురే తగవుదీర్ప
కల్లుసారా మస్తుగా ద్రావునట్టి పుం । డాకోరు దొరయె బడా కచేరి
తెన్ను గానక గడ్డిదిని పొడి దప్పుజ । టాకోరు సర్కారు నౌకరగునె
చేరు గొండల నొద్ద జేర్చి పాటించు జు । వ్వాకోరు మంచి హోదాకు దగునె

గీ॥ ప్రజల సేమంబు నరసిన పఋపులెల్ల । జబ్బువారల గొప్ప దర్జాల నిడరు
అనిపలుకు॥ 32

సీ॥ కొట్టితేపిన కోడిగూసినమాత్రాన । నద్దమరేయెట్లు పొద్దుబొడుచు
బిడ్డలాటలకు గొబ్బిళ్ళిడ్డమాత్ర వే । సవినెట్లువచ్చును సంకురాత్రి
చీకటింటను దివ్వెజేర్చినంతనె పట్టపగలింట నెట్లు జొప్పడును సందె
పెరటిలో చెట్లెల్ల పురుగుచే మోడైన । రహివానకారాకు రాలుపగునె

గీ॥ ఎద్ధియెప్పుడు గాదగునద్దియవ్వ । డొదవు మనమెంత జేసిననొండుకాదు
అనిపలుకు॥ 33

సీ॥ పెద్దలందరుగూడి పెండ్లిసేయగబూన । జోగిసన్నాసికిజుట్టె యెరువు
మునీ్మట దోరణమ్ములుకట్ట సమకట్ట । వెదురుగుంజలు బ్రాత గుదురె కరవు
మినపగారెలు వండగను బెట్టజిల్లికి । కేలులేనమ్మకు వ్రేలెకొదువ
సాతాని రామానుజయ్య జంగముసేయ । బిలువబోవంగొనె పేరెతప్పు

గీ॥ క్రొత్తపని యొక్కటొనరింప గోరెదేని । క్రొత్తలోక మరికొన్నిటి గూర్పవలయు
అనిపలుకు॥ 34

సీ॥ ఇచ్చలేనల్లున కెంతయొడ్డించిన । నీలకూరకు నుప్పు చాలదనును
ఈసుబట్టిన యత్తనేలాగు బొగడిన । ఎగతాళి మాటలకేమి యనును
తనివిదీరని గూళతలయెత్తు బోసిన । జుట్టుమిగిలెనేని కొట్టుకొనును
తగవు మాలిన మొప్పె దప్పుపై బెట్టిన । తప్పుజూచినవాని దన్నుమనును

గీ॥ తగినవారికి మేల్చేయ దగును గాని । తగనివారద్దిచేతురు తారుమారు
అనిపలుకు ॥ 35

సీ కలుద్రావిపాలన్న కల్లరీని బడాయి । కట్టరేమే యొక్కగడియలోన
పెరిగిన కడుపులో బిల్లయో బల్లయో । తెలియరేమే రెండునెలలలోన
ఏటినీళ్ళుగదోచు నెండమావులజాడ । యగుపడదే నాల్గడుగులలోన
తెరద్రుడ్డిపెండ్లికూతురిమేని వొంకంబు । పట్టలేమే తలంబ్రాలకరిని

గీ॥ మంచికానిది కొన్నాళ్ళు మరగియున్న । తుదకు నొక్కప్డు నిక్కంబు
దోచకున్నె
అనిపలుక ॥ 36

సీ॥ తరితప్పిపెట్టు విత్తనమెంతమంచిదై । నను బాగుపడునని నమ్మరాదు
ముదుసలి కట్టుకొన్నది పైడిబొమ్మయై । ననువలపిడునని నమ్మరాదు
వడుచుసన్నాసెంత వడిగలనేర్పరై । నను బాళిబడదని నమ్మరాదు
కడుపూప యెంతటి కావుదీర్చినదియై । ననుదియ్యనగునని నమ్మరాదు

గీ॥ ఎప్పుడెయ్యదిచేసిన నెసగునప్డు । తగును గావింపగాదేని తప్పినడుచు
అనిపలుకు॥ 37

సీ॥ ఈడిగాతని సారె యాడింప బూన్చిన । గల్లు బుడ్లను వాని కడను విడుచు
అంకులాడికిని బేటంటంబు సెప్పిన । గోర చూపుల మగవారి దనుపు
కొంటె బాతాఖాని గొప్ప కొల్వన నుంప । ఏలినవాని సొమ్మింట జేర్పు
గొట్టె కావరి గొల్ల గొడ్డు కావరి జేయ । పాలు పిండుచు గాలు పట్టి యెత్తు
గీ॥ ఎద్ది యెవ్వడు వనువడు నద్దిసేయు । నొద్ది కగునొండు సేయంగ నోర్వడెందు
అనిపలుకు॥ 38

సీ॥ కన్నములెవ్వచు దొంగలకు బక్కాదగా । కోరు వంచాయతీదారు సుమ్ము
తెగమండి పడు నగ్గి దేవరకును మంట । గాలి దేవర చెలికాదు సుమ్ము
మాల మాదిగ తందనాల జాతకు బంబ । దాసరిమేటి సర్దారు సుమ్ము
మగువ నేడ్పించెడి మగనికి గయ్యాళి । గట్టువాయగు తల్లి వట్టు సుమ్ము
గీ॥ కీడు సలిపెడి వారికి గీడు సలుపు । వారలేతోడు మరి లాతివారు కారు
అనిపలుకు॥ 39

సీ॥ ప్రాతి పెట్టిన సొమ్ము వయికి లాగినగాని । మారదు బంగారు మాడలయిన
కడుపులో దెవులు నేర్పడగ జాటినగాని । కుదరనేరదు రాచ కొమరుడయిన
గాదెలో సరకు లంగడిని బెట్టినగాని । మనవారు కొనరెంత మంచిపయిన
మొదవు చంటను బాలు ప్రిదికి దీసినగాని । పనిజేయదది యెట్టి పాడిదైన
గీ॥ నలుగు తెలిగిన వానికే చెలువమెందు ; జాటుగా నున్నవానికి దీటులేమ
అనిపలుకు॥ 40

సీ॥ మొఱయు లేనంతనె మెఱుగైన బంగారు। కంచుకంటెను గ్రించుగాదు సుమ్ము
మెదుకు లేనంతనే మేలైన బాపండు । కాపు కంటెను లోపుగాదు సుమ్ము
కైపు లేనంతనే కడతావిజవ్వాజి । కాచుకంటెను నీచుగాదు సుమ్ము
కడుపీగ నంతనే కమ్మని కొతిమెర । గాదకంటెను బీదగాదు సుమ్ము

గీ॥ విలువ వంగడమునుబట్టి కలుగుగాని । అందముల చందముల బట్టి పొందబోదు
అనిపలుకు॥ 41

సీ॥ తేలు కుట్టినవాని మేలైన పల్లకి । మీద నెక్కించిన బాదలేదె
పంచి బోయినవాని నంచ టెక్కల పాన్పు । పై బండ బెట్టిన బాదలేదె
ముక్కు గత్తిని గోసి ముద్దరాల్చెక్కిళ్ళు । మీద ముద్దిడుచున్న బాదలేదె
పది మడుంగుల బర్వుపై నెత్తిపై మేడ । మీద నెక్కించిన బాదలేదె
గీ॥ కస్తి లేనప్పుడింపగు కుస్తరింపు । కస్తికల తఱి మదికింపుగాదు సుమ్ము
అనిపలుకు॥ 42

సీ॥ దవసంపు మొలక నెత్తావి గూర్పనె కాని । తగునే తరిగివండ నిగుఱుగూర
కమ్మనావుల పాలు కాంచి త్రాగనె కాని । తగునే కడవ దొల్పి తానమాడ
చదువరి మాట అచ్చుల జెల్లునే కాని । తగునె గామి ఖసాయి తగవు దీర్ప
ఇల్లాలు జాణైన నిలుదీర్పనగుగాని । తగునే ఫిరంగిల జగడమాడ
గీ॥ ఎవరినే యక్కరను గూర్తురెల్ల వారు । వారి నా యక్కరను గూర్పవలయు సుమ్ము
అనువలుకు॥ 43

సీ॥ కుందేటికిని లేడి కొమ్ములు రెండిడ్డ । మోర యోరగ జేసి పొడువ గలదె
దోసికి దుప్పికొమ్మున బండ్ల మర్చిన । గట్టి సెన్గలు కఱకఱనమలునె
గొడ్డు రాలికి జంక బిడ్డ నొక్కనినిడ్డ । గొన గొన పాల్చేపి కుడుప గలదె
మఱుగుజ్జువానికి మఱ్ఱుగాళ్ళు కటిన । నొప్పుగా మడచి కూర్చుండ గలదె
గీ॥ తనకు లేనట్టి యందంబు దాల్చుకొన్న । దాన గలిగెడి కర్జమింతయునులేదు
అనిపలుకు॥ 44

సీ॥ ఏనుగు నెక్కగానే కాదు బలురేడు । పజల కష్టుల నెడ బాపవలయు
మేకను జంపగానే గాదు సోమాసి । బావలతనివి దీర్పంగ వలయు
ఎగసిత కైక్కగానే కాదు తీర్పరి । అందఱి నొకటిగా నరయు వలయు
ఈటె చేపట్టగానే కాదు పోటరి । పులిమీద మార్కొని పొడువ వలయు
గీ॥ జాణనని పూనినంతనే జాణగాదు । ఏర్పడిన పని నెరవేర్చి నేర్పరియగు
అనిపలుకు॥ 45

సీ॥ తల్లి పొట్టిదియైన బిల్లదా బొడుగైన । ఆ తల్లి కాపిల్లయమ్మ గాదు
బాపండు బడుగైన గావంద గాడైన । కాపు బాపని మ్రొక్కు గాంచలేదు
కత్తి చిన్నదియైన గాయ పెద్దదియైన । కాయ కత్తిని బట్టి కోయలేదు
పుత్తడి సేరైన నిత్తడి మణుగైన । పుత్తడి త్తడి గుత్త కెత్త నగునె
గీ॥ తక్కు వొక్కవితాన దానెక్కుడైన । నిక్కమున కెప్పు డక్కువ తక్కువయగు
అనిపలుకు॥ 46

సీ॥ సానితో నిచ్చ ముచ్చటలాడు విటగాడు । గుడిసెవేటును కూడు కోడె దూడ
గొడ్డునంజుడునెత్తి కొనిపోయెడి గొడారి । పనికిమాలినదెత్తు పాకిఁదిట్టు
తగునంచు గంజాయిదమ్ముగొట్టు పిసాసి । కల్లు ద్రావెడి దోసకారిదెప్పు
ఏటేటి దెవసాలకేగు బావడు పాడె । దాల్పు బావని నెగతాళిసేయు
గీ॥ తప్పుగలవారు తమతప్పులొప్పుచును । తలచి యొగ్గింత్రుదమకంటె దప్పులాండ్ర
అనివలుకు॥ 47

సీ॥ వానమిక్కిలెయైన వరదంగలారవు । వరపు మిక్కిలియైన కరవుబెడద
పొడవువానికి నెత్తిబొప్పుల పెనుబాధ । పొట్టివానికి నీళ్ళపట్టుగొడవ
ఉప్పెక్కువగు దోసెవచ్చిఁ దిన గోడు । చప్పిడి దినగవాచవికినిడుమ
బడబడవాగిన వదురుబోతను దూరు । అరుదు బల్కినమూగయనెడికొదువ
గీ॥ ఎప్పటికినేని మిక్కిలి మొప్పుపొందు । తప్పదందున నొకకీడు దాపరించు
అనివలుకు॥ 48

సీ॥ తేఁటఁబండిన పండు తియ్యగానేయుండు । వగరెక్కదే కోయ బచ్చికాయ
మఱగ దున్నినదమ్మువిరుగ బండునుసుమ్ము । కలయగట్టదు వాలగట్టినేల
మెదిగిన బియ్యము మెఱుకుగమ్మదనమ్ము । చేబియ్య పోరెమ్ము సేగిసుమ్ము
ముదిరిన చింతపండు వేవయెక్కును । లేతమొలకద్రావాలఁ జేతద్రుంప
గీ॥ పనులగడిదేరినట్టి నేర్పరునెకాక । కొరవడినవారు పూనిరా చెరుపుగల్లు
అనివలుకు॥ 49

సీ॥ కుక్కనెక్కి సవారుగొట్టచేర్చినకోతి । గుఱ్ఱమెక్కినవారు గొట్టగలదె
ఈళ్ళజిక్కగబట్టి వెళ్ళించునేర్పన । లేళ్ళమందల నప్పళించగలదె
చేరునుఁగట్టగూర్చిన చిన్నదారంబు । తేరునుఁబట్టి రాదీయగలదె
ఎద్దుమీదనుకట్ట నేర్పరించినగలత । ఏనుగుపీవుత ట్టినయగలదె
గీ॥ ఏదియెంతటి కొనగూడు నెప్పుడేని । దానినంతటి కొనగూర్పదగును సుమ్ము
అనివలుకు॥ 50

సీ॥ ప్రొద్దుబొడపంగానె పోవు జుక్కలదీటు । ప్రొద్దుగ్రుంకినవెన్క దద్దమెరయు
బడిపంతులెదుట గుఱ్ఱఁడు కొల్గదల్పడు । పంతులు చాటైన బంతులాడు
కడలిపోటైన వెన్కకు బట్టి చనునేరు । పాటైనచోజొచ్చి పారుచుండు
అత్తగారున్ననాళ్ళరవనేరదు కోడ । లాదటజూపు గయ్యాళితనము

గీ తనకుహెచ్చిన వారలెందాకనుందు । రంతదనుకఁ దనమెప్పులడగియుండు
అనివలుకు॥ 51

సీ నెలదప్పినంతనె నిసువు పుట్టగబోదు । నిండదొమ్మిదినెల లుండవలయు
వరినాటినంతనె వడ్లురాలవు పంట । కళ్ళాలదనుకనుఁ గాయవలయు
బోయినిప్పుడగానె బోనంబురాలేదు । వార్చిదించిన దాక నోర్చవలయు
మ్రానుఁగొట్టంగానె మద్దెలకాలేదు । తొలచి మూసినదాక నిలువ వలయు
గీ ఎప్పుడెయ్యది కాదగు నప్పుడగును । గాని పూనినతోడనే కాదుసుమ్ము
అనివలుకు॥ 52

సీ క్రొవ్విన జెల్లనిక్కుచు నీళ్ళమిడిసిన । గట్టుపైఁబడుఁ బెద్దగ్రద్దనోట
బోతరించినపాము పుట్టెక్కి తలయెత్త । గక్కున గడదేరు గరుడినోట
బొగరుకొన్న బొటేలు తెగిమందబాసిన । పీలు జిక్కు దోడేలుబారి
గుంజబట్టిన నల్లి కోడెక్కి నిలిచిన । గాసిచెందును సొంతగాని చేత
గీ కన్నుగానక నెళవులు గదలిమిట్టి । పడినవారికి నిక్కంబు గొడవ వచ్చు
అనివలుకు॥ 53

సీ బోనకత్తెకు దిష్టిబూదిబెట్టిననెంత । వచ్చునంతియు రాటి వాసమునకు
కడలికిఁ దియ్యనీర్కట్టి పెట్టిననెంత । వచ్చునంతియు మిన్నువాక కెన్న
ఆసహెచ్చినవాని కరువదిచ్చిననెంత । వచ్చునంతియు రాయబారికెన్న
మరుగుదొడ్డికి నెత్తరమన్ను బూసిననెంత । వచ్చునంతియు పాలగచ్చుగదికి
గీ॥ మొద్దునెప్పుడు తప్పులు దిద్దలేము । తప్పులెరుగనివాని దిద్దంగనేల
అనివలుకు ॥ 54

సీ॥ వేసాలపేఁడికి మీసాలమర్చిన । మూతిబిగియఁబట్టి మొత్తుకొనును
గమిడి బర్రెకు గుద్ద గంగడోల్కట్టిన । చీదరించుకపట్టిచించి వైచు
కోడితోకకు నొక్క కుంచెగట్టించిన । నెగయనేఁకనేల బొగిలిపడును
తుట్టెపుర్వునకొక్క త్రోలుపడగ బెట్ట । దలయెత్తనేరక దన్నుకొనును
గీ॥ ఒకరి వలెనుండవలెనని యొకటిసేయ । నకట నదియెక్క పెనుబాదయగును
సుమ్ము
అనివలుకు॥ 55

సీ॥ వరి వెన్ను విడిచి కొబ్బరికాయ కాసించు । చిలుకేమిదిను ముక్కు చెడుటగాక
గాద బోవిడిచి దిగ్గన నగ్గిపై బడు । మిడుతేమి దినుమంట బడుటకాక
బుట్ట గింజలుమాని బోనులో బడు పంది । కొక్కేమిదిను లోన జిక్కుగాక
చిటి చేపలను మాని యెర పుర్వునకు బోవు । మీనేమిదిను బ్రయ్యలౌను గాక
గీ॥ తినుచున్నది విడిచి యింకనొక పెద్ద । తిండి కాసించు బోవునతండు చెడును
అనిపలుకు॥ 56

సీ॥ బోసి కుక్కకు దొడ్డ ముడుసెమ్ము దొరికిన । గొరుకనేరదు పాసి యుఉకలేదు
ముసలాతనికి నొక్క ముద్దరాల్దొరికిన । కూడ నేరదు పొత్తు వీడలేదు
తిమ్మన చేనొక్క తెంకాయ దొరికిన । కొట్టలేదు విడిచి పెట్టలేదు
కచ్చసానికి బాట కచ్చేరి దొరికిన । పాడనులేదు మాటాడలేదు
గీ॥ తినఁ గలిగినట్టి వారికి దియ్యగూర । లేనివారికి విడువంగలేని యేడ్పు
అనిపలుకు॥ 57

సీ॥ తన యింటి దివ్వె చేతను బట్ట గాలదే । తనయాలు పడచిన దప్పుగాదె
తాను దీర్పరియైన దగపేద పచ్చునే । తాను ద్రావిన కల్లు పానకంబె
తన కోడి వెన్కదీసిన గెల్పు గల్గునే । తనమేని కంపు నెత్తావి యగునె
తన వెంద్రుకలు గట్ట దంబుర మోగునే । తా బెట్టుకొను పట్టు తప్పనగునె
గీ॥ ఎన్నటికినైన పెరలయుందేది యెగ్గు తనకు దానిన యెగ్గుగా దలపవలయు
అ...పలుకు॥ 58

సీ॥ పొరుగువారికి మేలు పొందరాదంటివా । ఇరుగు వారికి నీవ పొరుగువాడు
ఇరుగు వారికి మేలు హెచ్చరాదంటివా । పొరుగువారికి నీవ యిరుగువాడు
ఇరుగు బొరుగును మేలెనయరాదంటివా । యిరుగు బొర్గునకీవ యిరుగుబొరుగు
ఇరుగు బొరుగు నీవు నెనయ రాదంటివా । ఇంక నెవ్వరికి మేలెనయవచ్చు
గీ॥ ఎల్లరకు మేలుగోరుట చెల్లు గాని । తనకు మేల్పొరలకు గీడు దలపరాదు
అనిపలుకు॥ 59

సీ॥ తాత గట్టిన నూయి తప్పదెన్నటికని । యుప్పు నీళ్ళను ద్రావు మొప్పెగలడె
పెద్దలందరుగూడి పెండ్లి చేసి రటంచు । జెడిపె బెండ్లామును జెందగలడె
కట్టుబోతులు వాడ గలరు పెక్కండ్రని । వలికి బెండిలిసేయువాడు గలడె
బాపల దీవనల్ బమ్మ దీవనలని । తన యాలి నెరవిచ్చు వెనటి గలడె
గీ॥ కాన రానట్టి యొక బల్మికలడటంచు । తనులకును దోచు గీడెమ ర్కొనగలండె
అనిపలుకు॥ 60

సీ॥ ఎలుకలల్లరిచేసి చెలరేగినంతనే । పెంకపూరున నిప్పు బెట్టునెవడు
పంట కాలువ లోతుబారె దాటుట కంచు । కట్టెల్కతో నెండగట్టు నెవడు
జలుబు చేసిన జీడ జాలనటంచును । ముక్కు గోసికొనెడి మొప్పెయెవడు
పసి పాపలకు జంటి పాలు చాలవటంచు । మేలైన యాలిబో దోలు నెవడు
గీ॥ కొద్ది జబ్బొందు గలదని గొప్పదాని । మొదలు చెడ గొట్టుకొనువాడు మొదలె
చెడును
అనిపలుకు॥ 61

సీ॥ పాలు మంచివి యైన బానెంబు మంచిది । గాలి మంచిదియైన గాలునుంచి
పోగు మంచిదియైన బుట్టంబు మంచిది । పొదుగు మంచిదియైన మొదవుమంచి
పసిడి మంచిదియైన జట్టెడ మంచిది । నీరు మంచిదియైన నేరు మంచి
మాట మంచిదియైన మరియాద మంచిది । యీటె మంచిదియైన బోటుమంచి
గీ॥ మంచిగోరిన వాడెప్డు మంచిదైన । పని యొనర్పక యూలు కేప్పడదు మంచి
అనిపలును॥ 62

సీ॥ తన కొంప దక్క నందరి కొంప లురలంగ । పెడుగు మానిసికోరు జిల్లి పిడుగు
తన పైరు తడిసి యందరి పైరు లెండంగ । చెంటి వాడాసించు జెముడు
మబ్బు
తన యింటనుండి యందరి యింట లేకుండ । తుంటరి తలపెట్టు గుంటి లచ్చి
తనమేలె చూచి యందరి మేల్కనక యుండ । కొంటె యారయు మెల్లకంటి
వేల్పు
గీ॥ ఎల్లరకు మేలుగోరుట చెల్లుగాని । తనకె కావలెననుకొన్న దరమె పడయు
అనిపలుకు॥ 63

సీ॥ కప్పగంబము చేరి కౌగలించిన గూట । ములు లేనిపే బిడ్డ కలుగబోదు
గాము గంగకుమీదు గట్టినంతనె తిండి । తినకున్న నాకలి తీరబోదు
పడమటి దెసనుండి బల్లి పల్కంగానె । దొర జూడనిదె కొల్వు దొరకబోదు
చందురుండును బొద్దు చాలి యుండంగానె । పడుచునాడక పెండ్లి నడపబోదు
గీ॥ సామిగొల్చిన సగినము లక్కనైన । తనదు పూనిక లేనిదే పనులు గావు
అనిపలుక॥ 64

సీ॥ పాలు పిండెడి గొల్లవాని జూడంగానె । పంచడిల్లదె మంచి పాడి మొదవు
కాసు విడుచు నీటుకాని జూడంగానె । కన్నులార్పదె వెలపన్నె కత్తె
మేసి వచ్చిన తల్లి మేక జూడంగానె । చిట్టాడికూయవే చిర్తుత బొదులు
మదికి నింపగు చందమామ జూడంగానె । పొంగారదే మిన్ను ముట్టి కడలి
గీ॥ తనకు మేల్చేయు వారల గనిన నొక్క డుబ్బి చెలరేగనట్లుగా కున్నలేదు
అనిపలుకు॥ 65

సీ॥ మొలక పాటున నడ్డిమలచి కట్టినగాని । తడబొంగు పల్లకీ దండె గాదు
లేత పాటున జివ్విపాత్ర గట్టినగాని । మంద చక్కని యంటు మావి కాదు
దూడ పాటున ద్రిప్పియాడ నేర్పినగాని । ఎద్దు వన్నిన గంగిరెద్దు కాదు
నారు పాటున దీసి నాటి పెంచిన గాని । దుక్కి మూసిన వరి దుబ్బుగాదు
గీ॥ పాటుపడి నేర్వవలె జిన్ననాటనుండి । కాని యెద నెందునను జాణగాడు సుమ్మి
అనిపలుకు॥ 66

సీ॥ కాళ్ళు బోయినవాడు కాళ్ళకై తిరుపతి । గట్టెక్కబోయిన గదలుటెట్లు
కనులు బోయిన వాడు కనులకై తాగిండ । జోతి జూడగ బోవ జూచుటెట్లు
చెవులు బోయినవాడు చెవులకై సద్దులు । వినగబోయిన జేరి వినుట యెట్లు
మాట బోయినవాడు మాటకై మంతరాల్ । చదువబోయిన బట్టి చదువటెట్లు
గీ॥ కానరానట్టి మేలొందు కలుగటంచు । కాని పని సేయగా సమకట్టదగదు
అనిపలుకు ॥ 67

సీ॥ పట్టుజాలము నీళ్ళపాలలో గలసిన । తెలియమే పెరుగులో గలసినపుడు
కనలేము కపురంబు గాలితో గలసిన । నెరుగమే దివ్వెతో బెరసినపుడు
పొడ కట్టలేము పుప్పొడి నేల గలసిన । కానమే పూవుతో గలసినపుడు
ఎరుగలేము కచాడ దుబారు గలసిన । చీలదే పూరితో జేరినపుడు
గీ॥ ఒక్కదొక్కని గలసిన జక్కనదుకు । నతడె వేరొందు గలసిన నదుకదెపుడు
అనిపలుకు॥ 68

సీ॥ పొట్ట కాయుకు రాయి గట్టుట తిన్నగా । బెరుగుటకే కాని విరుగ గాదు
పసిడిరేకులకుప్పె ము సరి కాల్చుటవన్నె । పెరుగుటకే కాని తరుగ గాదు
చదివెడి వానికి జబుకు దెబ్బలు బుద్ధి । వచ్చుటకేకాని నొచ్చగాదు
జక్కి పిల్లకు గాళ్ళనొక్కుట జక్కగా । జరుగుటకే కాని విరుగ గాదు
గీ॥ తొలుత నొక్కింత బాదగా దోచియున్న । మంచికై చేయు పనిని మన్నించవలయు
అనిపలుకు॥ 69

సీ॥ జొన్నకూటిని దిన్నయున్న కండెకు లావె। సన్న బియ్యము దిన్నయన్న బలిమి
దస్తు మస్తుగు జమీదారాస కెక్కుడే । నాటి బువ్వడగు సన్యాసియాప
నడుము గట్టిక బోయి నడకకు మిక్కిలే । యందలంబెక్కిన యతని పరుగు
పుట్టు వడుగు సేయునట్టి పాటున కంటె । పలువు రాండ్రగు గేస్తు సలుపుపాటు
గీ॥ ఘంచి చెడ్డల కానవాళ్లెంచి చూడ । కలిమి పేదరికంబులు గావు సుమ్ము
అనిపలుకు॥ 70

సీ॥ చేద స్తమున నేళ్ళు చెల్లిన బావందు | పెద్ద చెర్వున జల్లు బేడనీళ్ళు
కలవాడనని కన్ను గానని మతకరి | నెదురైన బావని జదియగొట్టు
కడుపు గట్టుక మూట గట్టు పిసినిగొట్టు | గవ్వబోయిన పూట బువ్వమాను
మరులెక్కి యొడలు తిమ్మిరిగొన్న తుంటరి | వరుసవావుల బెద్దవాక గలుపు

గీ॥ మంచి చెడ్డల నరయుక మదికి దోచి | నట్టి యొకపట్టు బట్టుట చెట్ట సుమ్ము
అనిపలుకు॥ 71

సీ॥ నారు బోసినవాడు నీరు దా జల్లడే | బత్తె దెచ్చినవాడు పఱపు దేడె
చెలమ త్రవ్వినవాడు చేమ ద్రాడుంచడే | యెడ్లను గొన్నవాడేరు కొనడె
గుడిసె గట్టినవాడు తడక దాగట్టడే | పిల్ల బెంచినవాడు పెట్టగొనడె
ఊరు గాయిడెడివాడుప్పు దాబడయడె | జిగిజక్కి కొనువాడు జీనుగొనడె

గీ॥ గొప్పలగు నట్టివాని గైకోలు సేసి కొదువ సేయునె వలసిన కొంచెములను
అనిపలుకు॥ 72

సీ॥ గచ్చాకు పుచ్చాకు కలిపి నూరినయుండ | మంచి మందై తెగుల్మాన్ప జాలు
చెడు చెట్టు పడు చెట్టుచేరి క్రమ్మిన పట్టు | అడవి మెకలప లేపడుల దీర్చు
చిరుగవ్వ మరుగవ్వ చేర్చిపెట్టిన ప్రోగు | కూరాకు తేనట్టి కొఱత దీర్చు
తడచువ్వ మడచువ్వ తడకగా గట్టిన | గుక్క గుడిసె దూరు కొదువ దీర్చు

గీ॥ పలు దినుసులందు నది కొంచెపాటిదైన | నక్కఱకురాని దొక్కటియైనలేదు
అనిపలుకు॥ 73

సీ॥ నెఱసిన ముసలమ్మ నెఱులు జవ్వనమున | దుమ్మెద ఱెక్కల తోటిసాటి
ఉడికి ముద్దైన గుమ్మడిపండు మున్నుపా | దుననున్నపుడు కుండతోటి సాటి
చిలికి గుల్లైవంట చెఱకు జేసిన చేవ | తొలుత మ్రాకుననుక్కు తోటిసాటి
వగిలి పెంకై నేలబడిన చిళ్ళప నంటి | పాటున జత్రాతితోటి సాటి

గీ కలిమి బలములు నతములు కావుసుమ్ము | కాఱుమాఱిన కొందిని మాఱుమందు
అనిపలుకు॥ 74

సీ॥ పెద్దకెంపొక్కటి పెంటలో దొరికిన | విలువ తగ్గదు దానివెలుగు పోదు
కమ్మ గుమ్మడిపండు కంచెలో కాసిన | చక్కదనముబోదు చవియుబోదు
మల్లెపూవులు మాలపల్లెలో పూసిన | తీవితగ్గదు కమ్మతావిబోదు
గొప్ప నెమలిగ్రుడ్డు కోడి దా పొదిగిన | చిన్నె మాఱదు కుంచె వన్నెబోదు
గీ॥ వాసిగల వంగసము గలవాని కెపుడు | చోటు మాఱిన మాఱునే సొంపు బెంపు
అనిపలుకు॥ 75

సీ॥ అచ్చి బచ్చలకెక్కునని బుచ్చి పెండ్లాడ । బుచ్చి మిండలవెంట బోవమరుగు
తోటాకు పసరంచు దోసకాయను తిన్న । దోసకాయది జబ్బుచేసి విడుచు
కోడూరు బురదని మేడూరు బోయిన । మేడూరిలోజాస్తి మెట్టశిస్తు
జక్కిదాణాకోసి స్వారెక్క పూనిన । బోయి బత్తెములకే పోవుగడన
గీ॥ కొంచెమిబ్బంది కలదని క్రొత్తబూని । ప్రాత విడిచిననది దాని తాతయగును
అనిపలుకు ॥ 76

సీ॥ మాఱ్పజాలక నేల మంటిలో గ్రాతిన । రూక కంటెను బుచ్చుపోక హెచ్చు
కట్టజాలక మూలబెట్టెలో దాచిన । చీరకంటెను గోగు నారబాగు
అన్నంబు పున్నెంబు సరయజాలక పెంచు । మేనుకంటెను ద్రోలు జీనుమేలు
మోహరించిన జోదుమూక జూచిన బారు । రౌతు కంటెను దున్నపోతు మిన్న
గీ॥ కలిగి యున్నది నలుగురు గాంచి మెచ్చ।నక్కఱకురాని దున్నలేనట్టె సుమ్ము
అనిపలుకు॥ 77

సీ। కఱచిన వేపి కాల్గఱచు వాడుండునే । కాక ఱాకును దబ్బ గట్టుగాక
దోచిన దొంగ యిల్దోచు వాడుండునే । ఱచ్చలో ఫిర్యాదు దెచ్చుగాక
కుట్టిన తేల్కొండి కుట్టు వాడుండునే । గచ్చగందము రాచి కాముగాక
పట్టిన దెయ్యంబు బట్టు వాడుండునే । గాలి బూదిదియాన గట్టుగాక
గీ॥ చెడుగు చేసినపని జేయు జెరుపుబోదు । చేయవలసిన పని జేయు జెందుమేలు
అనిపలుకు॥ 78

సీ॥ కొమ్ముకోతిని నెరుంగుదునన్నవాడు రెం । డన్న నేమవి పదాఱన్న నేమి
తనతల్లి గొడ్డురాలని వాడది పెద్ద । దన్ననే మైదేండ్ల దన్న నేమి
పనస పూచెనని చెప్పినవాడు వేరున । నన్ననే మాకుల నన్న నేమి
యినుము బంగరు జేతుననిన వాడఱగాంచి । యున్న నేమది కాచ కన్న నేమి
గీ॥ దబ్బరల బన్నుగడ సేయు ధగిడి కొడుకు । దొక్కదబ్బర చాలదే తక్కు విడువ
అనిపలుకు॥ 79

సీ॥ ఏగాని సొఱ బుఱ్ఱ కాగానె రచ్చల । గాఱ బాడగవీణె కాయగాదె
అడవిలో బెరిగినదై నంతనే మద్ది । కొయ్య రాగద్దియు కోళ్ళుగాదె
యడుసులో బెరిగిన యంతనే నెత్తమ్మి । దేవేరికెంగేల దివియరాదె
పులిమేయు మెకముతోకలనున్న సివిరి । రాయల వింజామరమ్ముగాదె
గీ॥ మొదల దానెంత కొలదియై యొదవి యున్న । నక్కరకువచ్చుపనిబట్టి
యెక్కుడగును
అనిపలుకు॥ 80

సీ॥ తోడుపాటున కెద్దు దున్ను కోనిచ్చిన । మొగము మాడుపుకాపు మట్టి జూచు
పున్నెంబునకు గాపు పుట్టెడాళ్ళిచ్చిన । అసదీరని బాపడడ్డ జూచు
కనికరానకు నత్త గారెబూరెలు బెట్ట । కొంటె కోడలు పుట్టినింటి కంపు
పరువుకై కోడలుపడి యూడిగము సేయ । గట్టువాయత్త కాళ్లడుగు మనసు
గీ॥ తనివిగల వారికిని జేయుపనులు సెల్లు । తనివి లేనట్టివారికి దగదుసేయ
అనిపలుకు॥ 81

సీ॥ రాని కన్నడబాస పూని మాటాడబో । భేకు జెప్పగబోయి సాకుజెప్పె
తెలియని వాని మద్దెలగొట్ట బెట్టిన । నటుబోనము కుదినదికి మొత్తు
అలవాటులేని సాములు సేయుజని గత్తి । మొనచేత బట్టిక మొదట బొడుచు
ఎరుగనివాడు తానేరు బన్నగబోయి । దుంపకాడిని వై చితుదనుదున్న
గీ॥ అభ్యాసములేని పనులు సేయంగరాదు । చేసెనేనియు దప్పులు సేయుకున్నె
అనిపలుకు॥ 8

సీ॥ పనస వంకరయైన దొనలు పుల్లనగావు । చెరుకు వంకరయైన జేదుగాదు
యేళ్ళు వంకరయైన నీళ్ళు కారెక్కవు । మెరుపు వంకరయైన మెరుగు బోదు
మడి వంకరైన జానులు బొల్లుగాబోవు । పూవు వంకరయైన దావిబోదు
కుడుము వంకరయైన గడుపులో నొచ్చదు । వెండి వంకరయైన విలువ చెడదు
గీ॥ వంకరలకేమి గొనమె కావలయుగాక । యెంచి చూచిన వంకర యెందులేదు
అనిపలుకు॥ 83

సీ॥ కాపులందరు గూడి గంగజాతర జేయ । దొలగునే సివమాడు తొత్తుకొలుపు
వదుగు రూరనులంచ వంచాలు బెట్టంగ । తప్పునేచాటు చండాల పోటు
సాటివారలు వెట్టివాకిరి కొడబడ్డ । దీరునే వినక సర్కారుహుకుము
వాడలో వారెల్ల వలస బోయిననెట్టు । లెత్తిపోవున బుట్ట నెత్తిబెట్ట
గీ॥ నలుగురేగిన దారినే నడువు మంద్రు । మంచిదో కాదోయది యేరు నెంచలేరు
అనిపలుకు॥ 84

సీ॥ కల్లందరికి నొక్కకంపె కొట్టునుగాని । కంపు త్రావెడివాని కింపుసుమ్ము
వల్లమందెన్న సుందరికి జేదేకాని । మందు మింగెడివాడు మానలేడు
గంజాయి యేరికి గైపొక్కటియె కాని । కయిపు గొట్టెడువాని గలచలేదు.
చెడిపె కొందరికి జెరుపు తెచ్చును గాని । చెడిపె నుంచినవాడు విడువలేడు
గీ॥ చెడ్డచెడ్డయె మంచిమంచియె దలంప ।వానియుందిచ్చ యలవాటువలన బెరుగు
అనిపలుకు॥ 85

సీ॥ నల్లికోసరము మంచంబు దెబ్బలపడు । కురుపుకోసము త్రోలుగోయబడును
వగవానికయికోట బగుల గొట్టగబడు ।ఖజుమీలకయి చెర్వు కలచబడును
పొడపాముసకు బెద్దపొదలు గొట్టంబడు । కడ్డిజీరకు బైడి కరుగబడును
చెదలపుట్టకుగోడ జదియగొట్టగబడు । మురికికై బట్టంబు మొత్తబడును
గీ॥ చెడుగుతోబొత్తుతప్పక చెరుపెతెచ్చు । మంచితనమునదామెంతమించియున్న
అనిపలుకు॥ 86

సీ॥ చినుకుగారనిమబ్బు చెరగులన్నియుగమ్మ । పూతఋాయనిమావి పొలము నిండు
దారబిండనిబర్రె తవుడు తట్టెడుమేయు।కొండ్రదున్ననిదున్న కొమ్ముపొడుగు
వలపులేని వెలంది వగలు వడ్డికి బారు । ఏిలలేనిమగని బాళిమెండు
తెగులుదాకినలంజె మొగముమిసిమి హెచ్చు।కొలము తక్కువరాయితళుకులెస్స
గీ॥ చెట్టవారికిగలయుట్టి మిట్టిపాటు । మంచివారికి గానరాదెంచిచూడ
అనిపలుకు॥ 87

సీ॥ స్వారెక్క సన్నాసి సానినుంచిన నేమి । తొడగు లంగీలను దొడిగెనేమి
జందెమూడ్చిన గేస్తు సార్ద్రాగినేమి । తెల్లుల్లి నీరుల్లి దిన్ననేమి
చెడినబమ్మాసారి సిగను బెంచిననేమి । మొల్లలు మల్లెలు ముడిచెనేమి
తగవిలేని తపసి దారిగొట్టిననేమి । పులుల నెలుంగుల బొడిచెనేమి
గీ॥ చెడ్డపని యొక్కటేచాలు జెనపునకును । గడను పనులెల్ల దానికెక్కుడులుగావు
అనిపలుకు॥ 88

సీ॥ కొంచెగానికి లచ్చి కూడివచ్చినదేని । గొడుగుదేతెమ్మను నడిమిరేయి
కొంటెముక్కళి గొప్ప కొలువులోబెట్టిన । అందలంబున మేను గందుననును
పనికిమాలిన కూళ బడిపెద్దజేసిన । బసివాండ్రదనకాళ్ళ బిసుకుమనును
చెలువెరుంగని మోట సింగారమబ్బిన సరకాళ్ళజముదు న త్తరువునగరు
గీ॥ అలతికిని గొప్పతన మొక్కటబ్బెనేని । అదరిపాటక్కరకుమాలినంతజూపు
అనిపలుకు॥ 89

సీ॥ గుడిబట్టి దిగ్రమింగు గొప్పదెయ్యానకు । గుడితలుపెన్నవప్పడముగాదె
కడలిదోయిట బట్టు గండ్రడదేవరకెల్ల । చెరువులు నెగయు తుంపురులుగావె
పెద్దకొండలబట్టి పెకలించు దిట్టకు । చరియలందరి రాలు మొరముగాదె
గొప్పయోడలను లోగొని కొట్టుమీలకు । చలపతెప్పలు జంతికలనుగావె
గీ॥ అలవిగానట్టిపని సేయువలతులకును । కొలదిపని యొకపని యని తలరాదువ
అనిపలుకు॥ 90

సీ॥ మోట నాల్గింగిలీష్ముక్కలు నేర్చి ఫూల్ | గూసు నాన్సెన్సియూగో వెయనను
అంతియైదారూళ్ళ కమలుదారీచేసి | ఖబరుదార్ బాత్‌నకొకాన్‌పడకడను
మొద్దొక పల్లెకు మున్సఫీ సేయుచు | గాడ్దెకొడుక పన్ను కట్టుమనును
చండి యొక్క మఃరాకు సముతుదారాయెనా | కొంటెబడకరయితుగొట్టుమనును
గీ॥ చదువు చదివిన హోదాలు చక్కబడిన | నోటిపట్టము గలవారి కేటిపాటి
అనిపలుకు॥ 91

సీ. ముషిణికాయనుగాకి ముట్టకుండగగుడ్డ | కట్టకట్టిననేమి కలుగునందు
పిల్లకాకిని గూటబెట్టియోరెము బెట్టి | యక్కక్కయననేమి యబ్బనందు
పొట్టేలునకువాగె బెట్టిగట్టిగ బట్టి | కదనునేర్పిననెమి యొదవునందు
వడుపుబానిస తొత్తు మెడను బంగరు తాలి | బొట్టుఁ ట్టిననేమి పొసగునందు
గీ॥ తగనివారల నొక మంచి దారిబెట్ట | గలుగు కర్జంబొకింతైన గానరాదు
అనిపలుకు॥ 92

సీ॥ వ్రాతకరణమెప్డు వ్రాయుచుగూర్చుండ | మేతకర్ణముదిన రైతుసొమ్ము
మంతరాల్చెప్పుచు మల్లుబొట్లుండగ | నేగాని దిగ్రమింగు నెల్లుబొట్లు
కూచమ్మకుండలో గూర్చిబెట్టుచునుండ | మాచమ్మతాజేరి మాయజేయు
కంపునోరగుమామ గడియించుచుండగా | నంచినోరల్లుడు నట్టవరచు
గీ॥ పాటుపడువారలొక్కరప్పాటువలన | కడుపునిండించుకోన చుంద్రుకడమవారు
అనిపలుకు॥ 93

సీ॥ తాడిక్రిందను బాలు ద్రావినప్పటికేని | కల్లుద్రావినవానిగా దలంత్రు
వలికి లోసున్నంపు బట్టి బెట్టిననేమి | పీనుంగు కాదుగా బేరుకొంద్రు
మరుగుదొడ్డికి జాటుమాటాడబోయిన | రెండువ్రేళ్ళకు నయియుండు నంద్రు
సానియింటికి సందెజాము పోచిళ్ళకు | బోయిన దగులాట మాయెనంద్రు
గీ॥ కానిచోట సలపు మంచి కర్జమేని | కాని పనిగా దలంపక మానరెందు
అనిపలుకు॥ 94

సీ॥ అలిగెజాండరు చాల బలిమి వాడంటిమా | గుజిని మామూదెంత గొప్పవాడు
గుజిని మామూదెంత గొప్పవాడంటిమా | ఔరంగజీబెంత పేరివాడు
ఔరంగజీబెంత పేరివాడంటిమా | ఫ్రాంసు బుస్సీ యెంతపనియొనర్చె
ఫ్రాంసుబుస్సీ యెంతపనివాడటంటిమా | యింగిరీజలను క్లయివెంతవాడు
గీ॥ కలిమిగలవారు పెక్కంద్రుకలరుపుడమి | నొకరనిన వారికంటె మరొకరుగలరు
అనిపలుకు॥ 95

సీ|| తెలియునే యీనేల తిరుగున ంచై రోపి |యనుల గొబర్ని కసునకుమున్ను
ఒకదానినొకటి యీడ్చుకొనుచోడిమియున్న|దనిచదివిరెన్యూటనునకుమున్ను
ఎరుగుదురే తపాల్ మెరుగు వేగిరమును| నడచునంచును హారాకునకునుమున్ను
కనుగొనిరే త్రెడ్డుగాలి లేకనెయోడ | చనునంచు జేమ్సువాటునకు మున్ను
గీ|| తెలిసినది తక్కలేదని తలంచ... | క్రొత్తలింకను దెలియగా గోరవలయు
అనిపలుకు|| 96

నిండియున్నవనంటి నిలిచితాలిమియుండ | వెలితికుండ తొళుక్కు తొళుకు
మనదె
అన్ని బెట్టినవి స్త రణగి మణగి యుండ | నేమిబెట్టనివి స్తరె గిరిపడును
తెలివి నిండినవారు ధీష్టులై యొప్పంగ | మిడిమిడ చదువరుల్సాడి యెధీస్లు
గవరనర్ జనరలు కరుచిచ్చి వనిగొన్న | విల్లేజి మునసపు వెట్టిగొనును
గీ|| ఎక్కుడగు గొంచెగాంగ్రకే యెగిరిపాటు|అణగియుందురు నెరజాణలైనవారు
అనిపలుకు|| 97

సీ|| గెలుపుసాలిది మంచిగెలుపు నిచ్చుచునుండ | వానకారది యడ్డువచ్చునొక్కొ
మింటినెల కడింది మేలె సేయుచునుండ | వన్నెతగ్గెడనాళ్ళ వాసిచెడునె
పడగదాల్చెడి రోజు వట్టిమేల్సేయగా | పుడమిబుట్టిన యొక్కడడచగలడె
జేజేలవెజ్జులు చేరి బ్రోచుచునుండ | చెలగిన తేలేమి సేయుగలదు
గీ|| మొత్తమునమంచిదాదలయె త్తియుండ |చిన్నిదొనగులువడియేమి సేయగలవు
అనిపలుకు|| 98

సీ|| విక్టోరియారాణి వెలసి యేలుటబట్టి యిండియా పొగడిక యెక్కువాయె
పండ్లతోటలు దొడ్డవంటపైరుల బట్టి | మద్రాసు ప్రెసిడెన్సి మంచిదాయె
తియ్యజక్కెర వంటి తెలుగునుబట్టి గో | దావరి డిస్ట్రిక్టు ఠీవిగాంచె
మేలైన పనితివాచీల నేతనుబట్టి | యేలూరు పెద్దపేరెక్కనాయె
గీ|| యేదయిన నొక్కవిన్నాణ మెనయుకున్న | నెవ్వదేనియు నెన్నికకెక్కలేదు
అనిపలుకు|| 99

సీ|| గెలుపిండియానాడ గెలుపింగిలీష్ మాట | గెలుపువేలువుబాస గెలుపుతెలుగు
గెలుపుస్టీమరులార గెలుపు రైల్రోడ్లార | గెలుపు హైస్కూళ్ళార గెలుపుసైన్స
గెలుపుకాలువలార గెలుపు సోద్దెపుటాన | కట్టలారా టెలిగ్రాపులార
గెలుపుడార్విన్ధీరిగెలుపు ధియాసఫి | గెలుపునేషనలు కాంగ్రెస్సనీకు
గీ|| గెలుపు విక్టోరియారాణి గెలుపు గెలుపు | గెలుపు గెలుపనిపలుకుటె గెలుపుమనకు
అనిపలుకు|| 100

చ క్క ట్ల ద ం డ ము గి సె ను

# చక్రబంధము

ఈ గ్రంథమునందు 98 సీసమువలన కవిగ్రంథ సమాప్తి నొందించిన కాలము తెలియును. 99వ సీసము వలన గ్రామము తెలియును. 88వ సీసము రెండర్థములు కలదిగా నున్నది. మొదటి యర్థము వలన నీతియు రెండవ యర్థము వలన కవి గ్రంథసమాప్తి జేసిన కాలమును దెలియును.

కావున నిట్టి రెండర్థములు నందరికి సులభముగా తెలియు కొఱకు ఈ దిగువ నా యర్థములు వివరింప బడినవి.

| నీతిని దెలుపు నర్థము | కవి గ్రంథసమాప్తిజేసిన కాలమును దెలుపునర్థము |
|---|---|
| గెలుపుసాలు–జయకరమగుసంవత్సరము | గెలుపుసాలు – జయవత్సరము |
| వానకారు–వానలుగురియుకాలము | వానకారు – వర్షాకాలము |
| మింటినెల–అకాశమునందలి చంద్రుడు | మింటినెల – నభోమాసము అనగా శ్రావణమాసము |
| వన్నెతగ్గెడినాళ్ళ–కళలు క్షీణించు దినములయందు | వన్నెతగ్గెడినాళ్ళ–బహుళపక్షమందు |
| పడగదాల్చెడిరోజు – ధ్వజమెత్తు దినము మంగళకరదినము | పడగదాల్చెడిరోజు – సర్పతిథి అనగా పంచమి |
| పుడమిబుట్టినయొక్కడు–భూమియందు బుట్టిన యొకానొకడు | పుడమిబుట్టినయొక్కడు–భూమియందు బుట్టినకుజుడుఅనగా మంగళవారము |
| జేజేల వెజ్జులు – దేవతావైద్యులు | జేజేలవెజ్జులు – అశ్వనీనక్షత్రము |
| చెలంగినతేలు – చెలరేగిన వృశ్చికము | చెలంగినతేలు– వృశ్చికరాశి అనగా ఆనాడు మూడుగంటలకు |

